# పల్లె పాటలు

(ఈ పాటలను మానుకోట తాలూకా మునుగల వీడునుండి బియ్యాల వెంకట రామారావుగారు పంపినారు.)

౧. "కట్టమీదిమట్టి కాయలమట్టి
అమట్టిగొట్టించి దొడ్డిగట్టించి
ఆవులపెయ్యల ఆదొడ్డిదోలి
ఆరణమిత్తువురార అన్నపెద్దన్న"
"అడదానికేమి అరణమేమమ్మ"
"అట్లయితె నీతోడబుట్టలేదఅన్న"
"పుట్టితె పూలంచు చీరబెట్టేను
కలిగితే గాంధారికొల్లగడిగేను"
"పదేసిపెట్టెల ధనమునీకుంటె
పట్టుకుంతుమదాన్ని అన్నరో నేను,
ఐదేసిపెట్టెల ధనమునీకుంటె
అంగిరవికలదాన్ని అన్నరో నేను
నాల్గేసిపెట్టెల ధనమునీకుంటె
నల్లపూసలదాన్ని అన్నరో నేను"

... ...

౨. సన్నవిదారాన పేనినచుల్క—
కాళ్ల కాడి నేత కడ్యాల నేత
తలాపున బామెరపద్మము నేత
పట్టెమంచము సుభద్రపట్టివాలింది
పట్టెమంచముమీద పరుపులుపరిచి
పరుపులమీద వల్లెలుపరిచి
వల్లెలమీద మల్లెలుపరిచి
వల్లెలమీద ఒరిగెకాముడు
ఒరుగుతూకాముడు యేమనిపల్కె—
"పాటిమీదపత్తి చేనుపండినవాడు
పసుపుకుంకుమ సారెబెట్టిరామీవారు
"మావారు పేదవారు మాకేమిగలదు
"నూతిమీద మువ్వచేను పండినవాడు
నూరెములకకినంబు పెట్టిరామీవారు
"మావారు పేదవారు మాకేడగలదు
"అమాసవాడు అట్లుబోసుక
అల్లుడరమ్మని పెట్టిరామీవారు
"మావారు పేదవారు మాకేడగలదు
"తవ్వతోత వ్వెడు ఇచ్చినవారెవరు
తాగచెంబులుమాకు పెట్టితోరెవరు
"మావారుపే: వారు మాకేడగలదు
పెట్టుబోతలకాడ పెండ్లాడవయ్యా
కలిగినోరిండ్లల్ల కొల్లాక్క-వయ్యా
మాటమాటకునువ్వు మారామతావ"
మడిపెరుత్తికాలు మరితన్ని నాడు
కోరిపోయి సుభద్ర కొప్పులదగుల
గోడుగోడునయేడ్చి గోడల్లకొరిగి
పట్టుచీరవిడిచి పాతబట్టగట్టి
ఒంటిసొమ్ములుదీసి ఒకచోట బెట్టి
గజ్జెల్ల కాముని వెంటబెట్టుక
అంగిల్ల అచ్చమ్మ వెంటబెట్టుక
మూగల్లముద్దుని ,వంతిలీసుక
గంధానకడిగిన కడుపలుదాటి
వాడవాడలుదాటి వారిమేడదాటి
అవ్వగారితోవ బట్టె అప్పుడుసుభద్ర
ముంగిట్లనావొదినె సల్లజెయ్యంగి
ఇంట్లెనే వారన్న నిద్రబోకంగ
నిద్రబోయినావయ్యా వోరిలవరుడ
మాచెల్లెవచ్చింది నిద్రమేల్కొ—నిమి
దిగ్గుగ్గునలేచి దిగులుపడివొచ్చి
పూలచాపలుదెచ్చి భూమ్మీదపరిచి
పగిడిపల్లెము దెచ్చి పాదాలుబట్టి
పాదాలుసుద్ధించి పైజల్లుకోనుము
"గత్తాలువుండంగ యేనుగులుండంగ
కాల్నడకవచ్చిన కారణమేమి
బంట్లువుండంగ బోయిలుండంగ
ఒంటరిగవచ్చిన వొర్ద్దమేమి
"పదివేలుగలన్న నీతోడబుట్టి
పట్టెమంచముకొరకు యెక్కడికిబోను
నూర్వేలుగలన్న నీతోడబుట్టి
నూనెలగంటెకు నేనుయేవాడబోను
కోటివేలుగలన్న నీతోడబుట్టి
కొయ్యకొడ్వలికి నేనాడబోను
నడిఇంట్లోవున్నాయి నాల్గుబిందెలు
"ఆదిగోవో చెల్లెలా అర్ధంబునీకు
మన్వటవున్నాది పాడిఆవులమంద
పాటిమీదవున్నావి బర్లమందలు
"అవిగోవో చెల్లెలా ఆజ్ఞ బునీకు
పెద్దింటిఅర్గుమీద పెద్దన్నవదినె
నేబోయివస్తాను వో అన్నగారు
నేబోయివస్తాను వోవదినెగారు
"పొద్యుత్తగారింట్ల బుద్ధిగలిగుండు
మమ్మురచ్చకుదేకు మాతల్లినీవు
"చిన్నింటిఅర్గుమీద చిన్నన్నవొదినె
నేబొయ్యివస్తాను వోవొదినెగారు
"నానబియ్యము ఇన్ని నేవుకపోరాద
మూలవాసమునువ్వు దూసుకపోరాద
"అన్నరోవోయన్న మారాచన్న
చిన్నవొదినెమాట యిన్నవాఅన్న
"కోటికప్టాలకోర్చి కన్నదిమతల్లి
కోడలుదానిమాట పాటునిచెల్లె

... ... ...

3. అన్నదమ్ములులేని ఆమెసీతమ్మ
—డవిఎగిట్టడము అడపగ్గశాల
బావమరుదులులేని బాలుడురామయ్య
బాటల్లగట్టించు పగ్గశాలల్లు
అపగ్గశాలలో ఆడేరెవరు'
రామయ్యసీతమ్మ జూదమాడంగ
అనుతానుతనమ్మ ఆదిమాయలేడి
అటుజూడు రామయ్య అటుజూడవయ్య
అటుయేమిజూతునే ఆఅడవిమృగము
అడివిమృగముగనుక ఆటచక్కన
కోడెమృగముగనుక కొమ్ముచక్కన
మాయమృగముగనుక మాటచక్కన
అమాయలేడితో ఆరేరెకగావాలె
ముచ్చాలుదాపిన రేకొలుంచంగ
మురిలోలుకసీత మురిపెమెందుకు
వజ్రాలుదాపినావన్నెలుండంగ
వట్టిలోలుక సీత వలుసులుమయేల
పచ్చలుదాపిన పయిటలుండంగ
పచ్చితోలుకసీత భ్రమపడుటయేల
అడిదాన్నైపుట్టి అవతారమెత్తి
ఆరెకకోరుగంది వుండియెందుకు
మొగవాడవయిపుట్టి మొలతాడుగట్టి
ఆలేడినెయ్యంది వుండియెందుకు
యెర్రనిగుడ్డకు యెత్తికోపంబు
తెల్లనిగుడ్డకు తెచ్చేకోపంబు
పట్టెనుబాణాలు సంకబెట్టుక
తాబట్టుబొంగు బు చేతబట్టుక
పోయెనురామన్న లేడిజాడల్ల
పట్టపోయినలేడి పూరిమెయ్యంగ
బాణంబుసంధించి వేసెరఘురాము
హా ర ,ఆర' యనిలేడి అడ్డంబుబడెను
హారియన్నమాటలు ఆసీతవినెను
మల్లెతోటలవున్న మరదిలక్ష్మణ
మీయన్నకలబొరమాయె సుమ్మమరిది
మాయన్న కితభాగమాయెటాలకు
నీచేతగాజులు చిట్లునావొదినె
నీకాలిమట్టెలు కదులునావొదినె
నీనొష్టికుంకుమ నల్లబడునదినె
నానొష్టికుంకుమ కెడిత్తువొదినె
చుక్కలుఒలజల రాలునావొదినె
సూర్యుడు దాటయ్యె వెలుగునావొదినె
భూమితల్లడిల్లు పులిబొబ్బ బెట్టు
గల్లతెల్లడించు కలియుగము మునుగు
మరియేమిలక్ష్మణ మారుపుట్నిట్ల
అన్నఆలికినీవు ఆశపడ్డావ
వొస్సెనే లచ్చన్నకు కోపమొచ్చేను
గిరిగీసి గిరలోనే సీతనువుంచి
పోయెనే లక్ష్మణుడు అన్నజాడల్ల

— —

# సంస్థానాల జోలికి బ్రిటిషుయిండియావారు పోరాదు

## పాకిస్థాను విధానముచే హిందువిజ్ఞాన నాశనము

అఖిలభారత హిందూలీగు అధ్యక్షోపన్యాసము

సంయుక్తరాష్ట్రములో లక్నో నగరమున జూలై ౨౭వ తేదినాడు అఖిలభారత హిందూలీగు ప్రథమసమావేశము గంగాప్రసాద స్మారకమందిరమున ఎం. ఎస్. అనీగారి అధ్యక్షతన సమావేశమైనది. వివిధ ప్రాంతములనుండి అనేకమంది ప్రతినిధులు వచ్చియుండిరి. హరివిలాస శారదా, సర్ జె. పి. శ్రీవత్సవ, ప్రొఫెసరు రాధాకుముద ముఖర్జీ మున్నగువారు వేదిక నలంకరించియుండిరి

అనీగారు తమ అధ్యక్షోపన్యాసమునందు పాకిస్థాను విధానమువలన గల ప్రమాదముగూర్చి హెచ్చరిక, భారతదేశ మేకైకరాజ్యమని పునరుక్తి, ప్రస్తుత క్లిష్టసమయమున అన్ని జాతులసంఘములు ఐకమత్యముతో నుండవలెనని విన్నపము, సంస్థానముల జోలికిపోక తటస్థముగ నుండవలెనని సూచన గావించిరి

### సంస్థానాలగురించి పొరబాటు

సంస్థానాలనుగూర్చి వారిట్లుచెప్పిరి

“నరేంద్రుల విశ్వాసమును బడయుట అవసరము. భారతీయ ప్రజాప్రభుత్వమునగాని నరేంద్రులకు భయము అనుమానము కలిగించు పరిస్థితు లేర్పడుట శోచనీయము కాంగ్రెసు పెద్దలలో కొందరికి సోషలిస్టు, సాంఘిక పక్షపాత వైఖరి అలవడుటయే యిందుకుకారణము కాంగ్రెసు చిరకాలమునుండి దేశీయసంస్థానముల పరిపాలనవిషయమున తటస్థముగానుండి, యిపుడు అందలి ప్రథమశ్రేణినాయకులు ప్రత్యక్షముగా జోక్యం కలిగించుకొనుట పొరబాటనక తప్పదు సర్దారుపటేలు, డా॥ పట్టాభి, నేటు జమ్నాలాలు బజాజుగారలవంటివారు కొన్ని సంస్థానాలలో ఆందోళనసాగించుట క్షమింపరాని నేరము. అంతకన్నగొప్ప పొరబాటేమిటనగా మహాత్మ గాంధిగారి రాజకోట ఉపన్యాసము. దీనివలన భారతీ యైక్యతకు తీరనిభంగముకలిగెను.

కాంగ్రెసు సోషలిస్టు సిద్ధాంతములను నిరసించి, స్వతంత్ర భారతదేశమున నరేంద్రులకు గౌరవస్థానముకలదనియు నరేంద్రులపై వారిప్రజలు తిరుగుబాటు చేయునట్లు ప్రోత్సహించుట తమపనికాదనియు ప్రకటించవలెను. బ్రిటిషు ఇండియాలో, ప్రజాప్రభుత్వ మేర్పాటు చేయదలచిరి అది ప్రజాస్వామికము కావచ్చును నియంతృత్వము కావచ్చు, లేదా రాజేయుండవచ్చును. సంస్థానముల స్వాతంత్ర్యమునుమాత్రము అంగీకరింపక తప్పదు

సంస్థానములపట్ల అనుకూలమగు తాటస్థ్యవిధాన మనుసరించుటకు ఒక్క మినహాయింపు గలదు సంస్థానాలలో పరిపాలకులు వినాశకరమగు సాంఘిక పక్షపాతమును అనుసరించినచో, భారతీయ ప్రజానాయకులు యీ తాటస్థ్యమును వీడి, సంస్థానపాలకులు అట్టిపక్షపాతమును విడనాడునట్లు ఒత్తిడిచేయవలసియుండును.”

### పాకిస్థాను ప్రమాదము

పాకిస్థాను ఆందోళనను గూర్చి అనీగారు ఇపుడు “ఇండియాను రెండురాజ్యాలుగా విభజించినచో హిందూవిజ్ఞానమంతయు నాశనం కాగలదు. ఇట్టివిధానమునకు హిందువెవ్వడు అనుమతింపజాలడు ”అనిరి. ఇస్లాంరాజ్యాలన్నిటిని ఏకముచేయు సూచనను గూడ అనీగారు నిరసించుచు, “ఇండియా బర్మాలవంటి ఆసియాదేశాలను ఇస్లాముమతముక్రింద చేర్చుటకిది యుద్దేశింపబడినదనిరి

### హిందువుల కర్తవ్యము

హిందూలీగునకు కార్యక్రమమును యీదిగువరీతిని అనీగారు సూచించిరి హిందీకొరకే పాటుపడవలెను హిందువులు యిందుకు తగుబాధ్యతవహించి తమవిధి గుర్తింపవలెను ఇండియాలో అల్పసంఖ్యాకవర్గముల సమస్యలు పరిష్కరించుటకు యిచటి ప్రత్యేకపరిస్థితులకు అనుగుణమగు మార్పులతో జాతిసమితినియమములే అనుసరింపబడును హిందువులు రాష్ట్రీయస్వయంసేవక సంఘముబలపరుచుటకు వాలంటీరుల దళములను స్థాపించవలెను.

అస్పృశ్యత తొలగించుటకును, నిమ్నజాతుల విద్యఆర్థిక సైనిక సౌకర్యము లెక్కువచేయుటకు తగుకృషిచేయువలెను.

తమదేశరక్షణ బాధ్యతను హిందువులు ఎట్టి సందేహములేకుండ వహించవలెను ఈపని అధికారులతో సహకారము చేయునిది యుద్ధవిజయమునకు తోడ్పడనిది జరుగనిచో హిందువులు సహకారముచేయవలసినదే హిందువులు తమపాలకుల శ్రేయమునకు గాక, ఎక్కువగ స్వజాతి శ్రేయముకొరకే అట్లుచేయవలసి యుండును ” అని అనీగారు తెలిపిరి

### హిందూలీగు ఆవశ్యకత

రా॥బ॥కుప్పుస్వామి గురునారాయణగారు, హిందూలీగుప్రధానకార్యదర్శి సభప్రారంభోపన్యాసమునొసగిరి

ఆహ్వాన సంఘాధ్యక్షులగు సర్ జె. పి. శ్రీవత్సవగారు తమస్వాగతోపన్యాసమునందు పాకిస్థాను విధానమును నిరసించిరి భారత మహమ్మదీయులు విదేశప్రభుత్వముకలచే ప్రత్యేకజాతిగ ఏర్పడుట గమనింపబడదగినది

### తీర్మానాలు

జూలై ౨౮ నాటిఉదయము సమావేశమునకు చాలామంది ప్రతినిధులును, ప్రేక్షకులునువచ్చియుండిరి

ప్రత్యేక సంఘములు వేర్వేరు కోర్కెలు తెలుపుటవల్లను, ముస్లింలీగు కలిసిరాక చీలిపోవ యత్నించుచుండుటవల్లను రాజకీయపరిస్థితివిక్కగానున్నందున సమితివారు ఆందోళనపడి, దేశమంతటిని ఒకమార్గమున నడిపించి, అన్నివర్గములలోను, బృందములలోను, కక్షలలోను ఐకమత్యము పెంపొందించవలసినదని ప్రతిసంస్థను కోరుచున్నారన్న తీర్మానము అధ్యక్షుడు ప్రతిపాదింపగా ఆమోదింపబడినది

### పాకిస్తానుఖండన

పాకిస్తాను యత్నము దేశమునకు విరుద్ధమైనది, ఆత్మహత్యకరమైనది అందువల్ల భారతదేశమును మాతృదేశముగా భావించి దానిసభ్యత, స్వత్వము రక్షింపగలవారందరును ఇండియాను సాంఘికబృందములుగా విభజించుప్రయత్నములను గట్టిగా ప్రతిఘటించవలెను దానిని కాంగ్రెసు, ఫార్వర్డుబ్లాకు, లిబరలు ఫెడరేషన, ఇతర రాజకీయసంస్థలు ఏకాభిప్రాయముతో పనిచేసి ఎదుర్కొనవలెనని సమితివారు కోరుచున్నారు అనిమరొకతీర్మానము ఆమోదింపబడినది

పాకిస్తాను ప్రతిఘటనోద్యమమును నడుపుటకు అన్నిచర్యలను తీసుకొనుటకును, రాగల జనాభా లెక్కలలో హిందూ సంఘమునకు సంబంధించిన అంశములను సరిగావ్రాయునట్లు చూచుటకును అధ్యక్షునికి అధికారమీయబడినది.

కమ్యూనిల్ డిపార్టు జాతీయతాభివృద్ధికి అటంకముగనుండి, వివిధసంఘములతో సరసమైన సంబంధములుండుటకు అడ్డుపడి దేశములో శాంతిభద్రతలకు భంగముకలిగించి, పాకిస్తాను తత్వమునువారు తెచ్చిపెట్టినది కాబట్టి అవిధ్యము రద్దుకావలెనని కోరుచునొక తీర్మానము చేయబడినది

అస్పృశ్యతా నివారణకు హిందువులు సాధ్యమైనదంతయు చేయవలెననియు నాజీతత్వము హిందూ సాంప్రదాయకములకు పొత్తుగావిరుద్ధమైనదనియు, నాజీతత్వమును భంగమొనర్చుటలో తనకుసాధ్యమైనంత సహాయము సహకారము చేయువీలగుటకుగాను బ్రిటిషుఇండియాను తక్షణమే వెస్టుమినిస్టరుశాసనము ప్రకారము డొమినియనుగా ప్రకటించవలసినదనియు, సభవారు తీర్మానాలుచేసిరి.

దేశరక్షణకు కావలసిన సైన్యము, నౌకదళము, విమానదళమునంతను భారతీయమయము చే…

చిక్కడపల్లిలో ముమ్మారుకాపు సంఘస్థాపన

హైదరాబాదు (దక్కన్) షహరేదరు ౨౮ నేటి ఉదయము ౯ గంటలకు కులసోదరులసభజరిగి పైసంఘస్థాపనచేయబడినది

తోటరంగన్నగారు అధ్యక్షులు, కొనిగారి వెంకటస్వామిగారు ఉపాధ్యక్షులు ఎర్రరాజయ్యగారు కార్యదర్శి సేవల్ల రామస్వామిగారు సహాయకార్యదర్శి

---

నర్పవలసినని బ్రిటిషుప్రభుత్వమును, ఇండియా ప్రభుత్వమును కోరుచుట్టియు, భవిష్యజ్జాతీయసైన్యములో అధికసంఖ్యాక సంఘమునకు ఆధిక్యముండుటవరకు హిందువులు (సిక్కులతోసహా) ఎక్కువమందిని సేవలోచేర్చవలసినదని కోరుచుట్టియు ఒకతీర్మానము ఆమోదించబడెను

---

## కావలెను

నిజాంరాష్ట్రమునందు మాకంపెనీలో పనిచేయుటకై ఏజంట్లు మరియు ప్రతినిధులు కావలయును ఉదారమైనపద్ధతులు చేరినవారికి మొదలు ప్రత్యేకముగా పని నేర్పబడును వివరములు యీక్రిందివారితో తెలుసుకొనుడు,

ఏ. కె. హారవు యూనిట్ ఆర్గనైజరు

సన్ లైఫ్ యిన్సూరెన్సుకంపెనీ (ఆఫ్ కనడా)

౨౦౩౫ సుభిక్ స్ట్రీట్, శికింద్రాబాదు.

Khan & Sons

## మలేరియా జ్వరపీడితులకు ఆహారము

మలేరియా జ్వరబాధితులకు శక్తి తగ్గకుండ జేయుటే మిక్కిలికష్టతరమైనపని ఘన ఆహారమన్న ఇష్టమేలేదు. పైగా జ్వరపువిషము నరస్నాయువులలోపోయి వాటిని బలహీనముగాజేసి, రోగినినిశ్శక్తునిగాజేయును. ఈకష్టమును డాక్టర్లు తొలగించినారు. హార్లిక్సు వందకువంద పుష్టినిచ్చునదై గాన జీర్ణావయవములకు ఏలాటి హానికలుగనీయక సులభముగా జీర్ణమై నరస్నాయువులకు శక్తిని చేకూర్చి సకలావయవములకు సామర్థ్యము నిచ్చును. ఎట్టి జ్వరమునకైనను హార్లిక్సు ఇంటిలో నుండితీరవలయును.

## హైద్రాబాదు బజారు ధరలు

తేది ౨౫-౧౦-౪౯ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లుకొలకము,

ధరలన్నీ హాలీలే.

| బియ్యము | పల్లా ౧కి ధర | | |
|---|---|---|---|
| | రూ | అ | పై |
| కిచిడీసాంబర్లు | ౨౧ | ౧౦ | ౦ |
| సంబర్లు | ౨౧ | ౪ | ౦ |
| ఢిల్లీభోగాలు | ౧౯ | ౦ | ౦ |
| రాంసాగర్లు | ౧౩ | ౧౪ | ౦ |
| నావక్రాం | ౨౦ | ౦ | ౦ |
| అర్కాటి | ౧౯ | ౦ | ౦ |
| కోనామణి | ౧౩ | ౭ | ౦ |
| బుసుమ | ౧౫ | ౭ | ౦ |
| దేవాని | ౧౫ | ౭ | ౦ |
| గోధుములు | ౧౩ | ౦ | ౦ |
| బన్సీ | ౧౭ | ౦ | ౦ |
| లక్డీ | ౧౬ | ౭ | ౦ |
| పోటియా | ౧౬ | ౦ | ౦ |
| ఎర్రగోధుములు | ౧౪ | ౦ | ౦ |
| జొన్నలు | ౧౨ | ౦ | ౦ |
| తెల్లజొన్నలు | ౧౦ | ౦ | ౦ |
| పచ్చజొన్నలు | ౯ | ౧౦ | ౦ |
| మడికట్టుజొన్నలు | ౯ | ౦ | ౦ |
| శెనగలు | ౧౩ | ౧౦ | ౦ |
| కందులు | ౭-౧౨-౦ నుంచి | | |
| | ౧౧-౦-౦ వరకు | | |
| మినుములు | ౧౩ | ౦ | ౦ |
| లంకలు | ౧౨ | ౭ | ౦ |
| సజ్జలు | ౧౦ | ౧౦ | ౦ |
| కుసుములు | ౮ | ౭ | ౦ |
| పప్పు | | | |
| శెనగపప్పు | ౧౩ | ౧౨ | ౦ |
| కంది ,, | ౧౬ | ౦ | ౦ |
| సిరిసినగ ,, | ౨౨ | ౦ | ౦ |
| లంక ,, | ౧౧ | ౦ | ౦ |
| మినుప ,, | ౨౪ | ౦ | ౦ |
| పెసర ,, | ౧౭ | ౭ | ౯ |
| బెల్లము | ౧౪ | ౦ | ౦ |
| ఉప్పు | ౧౧ | ౭ | ౦ |
| ఉల్లిగడ్డ | ౪ | ౪ | ౦ |
| మిరపకాయలు | ౯ నుంచి ౨౫ వరకు | | |
| దక్కెర మణుగు (౪౦ సే) | | | |
| జావా ,, ,, | ౧౪ | ౦ | ౦ |
| బొంబాయి ,, ,, | ౧౩ | ౧౪ | ౦ |
| మద్రాసు ,, ,, | ౧౩ | ౧౫ | ౦ |
| నిజామాబాదు,, ,, | ౧౩ | ౧౨ | ౦ |
| ఎం కెర ,, పల్ల | ౨౨ | ౨ | ౦ |
| దగ్గ చక్కెర ,(౪౦ సే) | ౧౬ | ౧౨ | ౦ |
| ఎల్లిగడ్డ ,౧౨సే | ౩ | ౦ | ౦ |
| అల్లం ,, ,, | ౩ | ౦ | ౦ |
| మణుము ౧౨ సే | | | |
| కొబ్బెర్నూనె | ౪ | ౭ | ౦ |
| కుసుమనూనె ,, | ౩ | ౧౨ | ౦ |
| నువ్వులనూనె ,, | ౩ | ౧౨ | ౦ |
| వేరుసెనగనూనె ,, | ౩౪ | | ౦ |
| పుంటినూనె ,, | | | |
| కిరోసిన్ (గ్యాస్),, డబ్బా ౧ కి | | | |
| తెల్లది ,, | ౪ | ౩ | ౦ |
| పచ్చది ,, | ౩ | ౯ | ౦ |
| నెయ్యి మణుము ౪౦ సే | | | |
| విదరునెయ్యి ,, ,, | ౪౫ | ౨ | ౦ |
| తెలంగానా ,, ,, | ౩౪ | ౦ | ౦ |
| వనస్పతి డబ్బా ౧ కి | ౧౧ | ౨ | ౦ |
| బంగారు తు ౧ కి | ౫౦ | ౬ | ౦ |
| వెండి ౧౦౦ తు | ౭౧ | ౭ | ౦ |
| తు ౧ కి | ౦ | ౧౧ | ౬ |
| పవరణ్ ౧ కి కల్దారు రూ | ౩౦ | ౦ | ౦ |
| మారకం | | | |
| హాలీకి కల్దార్లు | ౧౬ | ౬ | ౦ |
| కల్దారుకు హాలీలు | ౧౬ | ౭ | ౦ |
| ఆముదాలు బస్తా | ౧౨ | ౨ | ౦ |
| వేరుసెనగ | | | |
| బుడ్డలు పల్లా౧కి | ౧౧ | ౭ | ౦ |
| పప్పు పల్లా౧కి | ౧౨ | ౦ | ౦ |

గమనిక: —

౧. ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏవైనపొరపాట్లుండిన దానికి పత్రికవారుబాధ్యులుకారు

౨. నగరాలలో జిల్లాలలో వ్యాపారపు పేటలలోని కొన్నవర్తకులు తెమదుకొనముల ప్రకటనలు మాపత్రికలో వేసికొనిన వారి వ్యాపారాభివృద్ధికి ప్రచారముకలుగును

---

## యుద్ధసహాయానికై ౫౦౦౦ల వాగ్దానం

(ఓ.వి.) భువనగిరి, షహరేవరు౨౨

ఇక్కడికి గతం౨౬వతేది శుక్రవారము రోజున జిల్లా అవ్వలుతాలూక్దారుగారు అరుదెంచి స్థానిక తహశీలుకచ్చేరీలో సభచేసి యుద్ధనిధి (హారికేతు ఫండు)కొరకు సహాయముచేయుకొరకై ఉపన్యాసముచేసిరి. తర్వాత స్థానికులనే కమేటిగా ఏర్పాటుచేసినారు. హిమాయతుగంజులో 3000 మూడువేల రూపాయలు గ్రామములో ౨౦౦౦ రెండువేల రూపాయలు ఇచ్చుకొరకు కమేటి వారు తాలూక్దారుగారికి వాగ్దానము చేసినారు. తర్వాత తాలూక్దారుగారు వెళ్ళిపోయినారు. కమేటివారుమాత్రము బీదలనువిడచి ధనవంతుల వద్దనే వసూలుచేయుచున్నారు. ఇందుకు కమేటి వారును, తాలూక్దారుగారును బీదల ప్రశంసకు పాత్రులయినారు.

రాబోవు ౨౭వ శనివారమురోజున ఇక్కడ వేయబడిన హరనాథ టూరింగుటాకీసులో యుద్ధనిధికై (హారికేతుఫండు) ప్రత్యేకముగా పుకార్ అనుఉర్దూఫిల్మ్ స్థానికప్రభుత్వఉద్యోగస్థులు వేష్పించుచున్నారు. జిల్లా అవ్వలుతాలుక్దారుగూడ అరుదెంచగలరని తెలియుచున్నది. ఇప్పటికే టిక్కట్లు విరివిగా అమ్ముచున్నారు.

## పాలేరు వైరా ప్రాజెక్టు రివిజనఅయింది

కానిసున్వాయికాలేదు

౧. ఈప్రాజెక్టులక్రిందిభూములకు సిస్తులశ్యధికముగా నుండుటచేతను,

౨. భూములు నిస్సారముగానుండుటచేతను,

౩. రైతులు దరిద్రదశవలన తరీకాస్తుచేయ జాలకపడావా వుంచుకొన్నభూములకు రకములు తగిలించుటవల్లను,

౪. ఉద్యోగస్థులు బావస్థాభూములనుగూడ బిలావర్హాఆలో చేర్చుటచే బోలెడుఖుష్కీపెట్టి మురాఫాలుచేయగలవీవచ్చుటవల్లను,

౫. ఆయుకట్టులో చేర్చతగనిభూములనుకూడ ఆయుకట్టులో చేర్చుటవల్లను,

౬. వాగులకు గోతులకు, మిట్టలకు గుట్టలకు, చవుళ్లకు ఖరాబులకుగూడ రకములుతగిలించుచుండుటవల్లను ఈమొదలగు కారణములవలన రైతు లందరు దరిద్రులైకొందరు రైతులు యీభూములనువిడచిపారిపోవగా మిగిలినరైతులు ప్రభుత్వం వారికర్జీలుపెట్టుకొని, మహజర్లుపంపుకొని, పత్రికలలో ప్రకటించుకొని, ఆందోళనచేయగాచేయగా శ్రీనారాయణరావు సుబేదారు గారువచ్చి విచారించి రివిజన్ బందోబస్తు అయితేకాని యీ కష్టములన్నియుతొలగవని భావించిపైవారికి రిపోర్టుచేసి బందోబస్తుచేయించినారు. వారుజీవించియున్నట్లయిన యీపాటికీమాకష్టములను తీర్చిడివారేఅనిమానమ్మకము. వారుచనిపోయిన వెనుక బందోబస్తు మహకమవారిని.తొందరపెట్టి నవారులేరు. మూడుసంవత్సరములనుండి లెక్క అనుపూర్తిచేయక, సున్వాయి గావింపక పోవుట కారణమేమి? యింతటునైనదయామయులై ప్రభుత్వమువారు దరిద్రదశచేత పలుబాధలుపడుచున్న ప్రాజెక్టురైతులనుద్ధరించుటకు అతిశీఘ్రముగా ఒకమాసములోగా బందోబస్తు సున్వాయిగావించుటకు ప్రార్థించబడుచున్నారు, పైఁజేర్కొనబడినకారణములవలన నిరుపేదలైయున్న యీ రైతులు యెకరా ౧కి సగటురేటు (౬) అరు రూపాయిలకంటెను, హైరేటు (౮) యెనిమిది రూపాయిలకంటెను, ఎక్కువ భరించజాలరు. దొరతనంవారికిది సమాధానముకానియెడల మెట్టసిస్తుమీద య॥౧కి (౫)అయిదురూపాయిల నీటితీరువఃధించిసున్వాయివెంటనేజరిగించవలయును

ప్రాజెక్టు రైతులఅందరితరఫున
జంగా హనుమయ్యచౌదరి,
ప్రసిడెంటు,
వైరాప్రాజెక్టు రైతుసంఘము.

## సంస్కృతాంధ్ర కళాశాల నివేదిక

వరంగల్ లో ప్రమాదిసంవత్సరములో పైపాఠశాలను ముదిగొండశంకరశాస్త్రిగారు మున్నగు వారు అచ్చటి వైశ్యాదిప్రముఖుల సహాయముతో స్థాపించినారు. దాని ప్రథమనివేదిక మాకుపంపినారు. ౨౫విద్యార్థులున్నారనియు. వారి భోజనవసతులు వారేమామకొనవలెననియు సంవత్సరాదాయము ౫౧౧రు. అనియు వ్యయము౪౭౫రు. అనియు తెలిపినారు. నియమితమొత్తము బెంకులోపెట్టవలెనుకాని ఎంతమంచివారైనను వ్యక్తుల వద్దనుంచకూడదు, ప్రజాహితసంస్థల వాటిద్రవ్యము ఒకట్రస్టీసంఘముచే ఎన్నికలపద్దతిపై నడుపవలెను. ఈపాఠశాలలో ఇప్పుడేవర్ణములవారున్నారు. ఏయేవర్ణాలబాలురను చేర్పుకొంటురు. విశదముగా తెలుపవలెను. ఈపాఠశాలవారికృషి చాల ప్రశంసాపాత్రమే. అయతే వారు "మహానా తక్తాలు" విద్యాశాఖవారికి పంపుచున్నామని లెక్కలపట్టీలో తెలిపినారు. మరి విద్యాశాఖవారు పట్టీలుపంపమని కోరువారే గాని ద్రవ్యసహాయము చేసేవారుకారా? పాఠశాలవారును పురప్రముఖులును విద్యాశాఖవారి సహాయము పొందుటకోరరు. సంస్కృతాభిమానులును సనాతనులు ఇట్టివాటికై ప్రభుత్వ సహాయము వెంటనే కలిగించుటకేల ఆందోళనచేయరో చిత్రముగానున్నది.

## శాసనసభకు జాగీర్దారులు

హైదరాబాదు(దక్కన్)షహరేవరు ౨౧

రాష్ట్రశాసనసభకు ౨సంవత్సరాలు పనిచేయుటకుగాను ఈరాష్ట్ర జాగీర్దారు సంఘమువారు న॥ దోస్తు మహమ్మదుఖాన్ అనువారినిన్ని మహబూబుకర్జన్ అను వారినిన్నీ ఎన్నుకొన్నారు.

## రైలు ప్రమాదము

కొత్తపేట, దుల్లై౨౦

ఈదినం చిర్పూరు పేపరుమిల్లువారి కూలి మనుష్యులలోఒకరు రైల్వేలైనువెంట కంపెని తాలూకువాసములు వేస్తూయుండగా బరువుజాస్తిఅయి లైనుమీద ఖాజీపేటవైపు చూచుకుంటూ కూరొనియుండెను. అప్పుడు శిర్పూరునుంచి సామానుబండివస్తూ యెన్నిసార్లు సీటియిచ్చినను లేవకపోయినందున రైల్వే యింజను క్రిందపడి మరణించినాడు.

## కలరా—ఆత్మరక్షణము

హైదరాబాదు (దక్కన్) షహరేవరు ౨౨.

హైద్రాబాదు పురపాలకసంఘమువారు చుట్టుపట్టుగ్రామాలలో కలరా-గత్తెర- వ్యాపించినదనియు అచ్చటినుండి నగరానికి కొందరు వ్యాధిగ్రస్తులు వచ్చుచున్నారనియు అందుచేత పౌరులు కలరానుండి ఆత్మరక్షణ చేసుకొనవలెననియు-దానిమార్గము ఈక్రిందివనియు తెలుపుచున్నారు,

ఈకలరావ్యాధి నీరు.తిండి పాలు వీటినుండి వ్యాపించును. ఈగలద్వారా వ్యాధి వ్యాపించును. వాంతిభేదులతో వ్యాధిప్రారంభమగును.

నివారణమార్గాలు

౧. కలరాతగిలిన ప్రాంతాలవారిని మీయిండ్లలో చేర్చుకొనకూడదు.

౨. నీటినిబాగా కాచిత్రాగవలెను. పాలనుకూడా బాగాపొంగువచ్చువరకు కాచిత్రాగవలెను, అప్పుడు పక్వమైనఅన్నాన్ని భుజించవలెను, చల్దిఅన్నము చల్లనైనఅన్నము తినవద్దు

3. పచ్చికూరగాయలను తినవద్దు

౪. పండ్లను పొటాసియంపర్ మాంగనేటులోకడిగినతర్వాత తినండి.

౫. అన్నపానాలపై ఈగలను ఏమాత్రము వాలనీయకూడదు. వంటపదార్థాలుంచు పాత్రలపై ఈగలను వాలనీయవద్దు.

౬. అజీర్ణముకలుగునట్లుగా తినవద్దు.

౭. వంటయిల్లు పాయిఖానాలకు, మురికికాలువలకు దగ్గరగా ఉండగూడదు.

౮. ఎవనికైనా వాంతిభేదులుకనిపించితే వెంటనే నగరఅమీనులకుగాని హెల్తు ఆఫీసరుకుగాని తెలిపేది. సర్కారీ వైద్యాలయములో చేర్చి చికిత్సచేయించుకొనేది. రోగి సంగతి పైఅధికారులకు తెలిపితే అంబులెన్సుకారులో రోగిని చికిత్సాలయములోచేర్చి మందులిత్తురు.

కలరాటీకాలు ఉచితంగా అందరికిన్నీ సఫాయి వైద్యులు తీయుదురు: వైద్యులు మీ యిండ్లకువచ్చి తీసిపోదురు. మీరు మీకోరికను హెల్తుఆఫీసరుకుగాని అమీనుకుగాని తెలిపితే చాలును.

౧౦. మురికిబట్టలకు, అంటీసెప్టిక లోషన్ తోకడుగుడు. ఈమందును ఉచితముగా కోరినవారికిత్తురు.

౧౧ మీరశ్రద్ధచేస్తే మీ కుటుంబానికిన్నీ మీయింటి యిరుగుపొరుగువారికిన్నీ ఆపాయాలు కలుగును. కావున అందరును ఐకమత్యంతో యీపనులను నెరవేర్చవలెను.

## జిన్నా గారి దూషణలేఖపై ఆందోళన

జూలై ౨౨వతేది అహమదాబాదులోఆజాదు ముస్లింపార్టీవారిసభజరిగినది. "ఈలాటి తంతివార్తను తానుమౌలానా అజాదుగారికి పంపినందుకు పశ్చాత్తాపమును తెలుపుచు జిన్నాగారు మౌలానా గారిక్షమాపణకోరవలెను" అనిసభవారు తీర్మానించిరి,

అఖిలభారత మౌలానా ఆజాదుదినమును జరుపగోరుట

ఢిల్లీ, జూలై ౨౨

అగష్టునెల ౩, ౪ తేదీలలో ఢిల్లీలో భారత ముస్లింపార్టీ కార్యసంఘసభజరుగును, జిన్నాగారు మౌలానా ఆజాదుగారిని దూషించుచు పంపినతంతివార్తనుగురించి జిన్నాగారిచర్యను తీవ్రముగా నిరసించుచు తీర్మానములను ఉపన్యాసములను చేయుట భారతదేశములంతటను మౌలానా అబుల్ కలాం ఆజాదుదినమును జరుపుటమొదలైన విషయములనుగురించి సభవారాలోచింతురు.

సంయుక్తరాష్ట్రాల ముస్లింలీగు

లక్నో, జూలై ౨౨

"భారతదేశములో మైనారిటీ వదలినవారికందరికిని వోటుహక్కువుండవలెను. వీరందరును వోటుచేసి ప్రజాప్రతినిధి సంఘసభ్యులను యెన్నుకొనవలెను. ఈసంఘములో అన్నిమతములవారును సభ్యులుగావుండవలెను. వీరందరూ కలిసిభారతదేశానికి తగినరాజ్యాంగవిధానమును సిద్ధపరచవలెను. మనదేశీయులు సత్యాగ్రహముచేసినగాని మనదేశములో ప్రజాప్రతినిధిసంఘముయేర్పడదు. ఇందు జనసామాన్యమునకు బలముచాల అధికముకావలెను దేశములో ప్రజలందరకు జయ్పదముగా సత్యాగ్రహమును జరుపునిమిత్తము యీసభవారు సర్వవిధముల సహాయముచేస్తారు" అనేతీర్మానము నేడుయిక్కడ సంయుక్తరాష్ట్రాల స్వతంత్ర ముస్లింపార్టీసభలో ఆమోదించబడెను. ఈసభ నేటితో ముగిసినది.

## పాట్నా జిల్లాకాంగ్రెసు కార్యసంఘము

మహాత్ముని వాదమును బలపరుచుట

పాట్నా, జూలై ౨౨

"అన్నివిషయములలోనుకూడా కాంగ్రెసు వారు అహింసావిధానమునే అనుసరించవలెనని వార్ధాలోను, ఢిల్లీలోను భారతకాంగ్రెసుకార్యసంఘసభలో గాంధిమహాత్ముడు తెలిపినఆశయమే సరియైనది. భారతకాంగ్రెసు కార్యసంఘమువారహింసను గురించి చేసినతీర్మానము సరియైనదికాదు"అనిపాట్నాజిల్లా కాంగ్రెసు కార్యసంఘమువారు తీర్మానించినారు.

# గోలకొండ గ్రంథాలయము

## ఆర్యసమాజ మనసేమి?

ఇది హైదరాబాదు (దక్కను), సుల్తాను బజారులో, దేవిడీ బాగమందు ౪౦౧ నెంబరుగల యింటిలోనున్న వైదిక ధర్మ గ్రంథమండలివారిచే ప్రకటించబడినది. దీనిహిందీమూలమును రచియించిన మహాత్మానారాయణస్వామి గారు. ౧౧౧ పుటలు. గ్రంథాంతమున శ్రీ॥ శ్రీ॥ ఆదిపూడి సోమనాథరావుగారు రచించిన 'ఆర్యజీవితాదర్శము' అను గీతము చేర్చబడియున్నది.

ఈ గ్రంథము మొత్తము అయిదేసి పరిచ్ఛేదములుగల రెండధ్యాయములుగ విభజించబడినది. ఇందులో మొదటిఅధ్యాయమునందు ఆర్యసమాజ సిద్ధాంతముల మూలపురుషుడగు దయానందుని పుట్టుక కాలమున భారతదేశములో పరిస్థితియు, ఆపరిస్థితికి దయానందునిజన్మ ఏవిధముగ అవసరమైనదియు, అట్లుపుట్టిన దయానందునిద్వారా క్రొత్తసిద్ధాంతములుగ నెంచబడుచున్న భావములు ఉదయించుటకు ముఖ్యప్రేరకములైన అంశములను చేర్చి—దయానందుని జీవితచరిత్రవర్ణించబడినది. రెండవఅధ్యాయమునందు మొదటిరెండు పరిచ్ఛేదములలో ఆర్యసమాజస్థాపనము, దాని నియమములవివరణయు చెప్పబడినది. మూడవపరిచ్ఛేదమందు ఈశ్వరజీవప్రకృతులనుగూర్చి ఆర్యసమాజమువారి అభిప్రాయమున్ను, వేదోత్పత్తి, వాటిప్రామాణ్యమున్ను, ఈశ్వరోపాసనా ధర్మములును, వర్ణాశ్రమములనుగూర్చియు, గర్భాధానాది సంస్కారములనుగూర్చియు, యజ్ఞ, కర్మ, భక్ష్యాభక్ష్యములనుగూర్చియు ఆర్యసమాజముయొక్క అభిప్రాయమున్ను వివరణచేయబడినది. నాల్గవపరిచ్ఛేదమందు సృష్టివికాసమునుగూర్చి ఆర్యసమాజమువారు వేదములకు చేసినఅర్థమును ఆధునిక సైన్సు పరిశోధనల ఫలితము లెట్లుసమర్థించుచున్నవో తెలిపినతర్వాత అయిదవపరిచ్ఛేదమున సంఘములో స్త్రీలకు వేదములిచ్చుచున్న స్థానమునుగూర్చియు, శూద్రులు, అంటరానివారలస్థితిని గూర్చియు వైదికమతవ్యాపక కార్యమునుగూర్చి యు ఆర్యసమాజము సిద్ధాంతీకరించుకొన్న అభిప్రాయములు వివరింపబడియున్నవి.

ఈ గ్రంథమునందు ఈశ్వరజీవప్రకృతులు వేర్వేరు, అనాదులు అనిచెప్పినచోట, జీవాత్మ పరమాత్మలకు అభేదమును, జగత్తునకు అవిద్యోపాధికత్వమును స్థాపించిన ఆదిశంకరునివాదము తప్పు అని సందర్భవశమున ఖండనచేయబడినది, ఆర్యసమాజసిద్ధాంతములను సైన్సులో ఆధునికులపరిశోధనలఫలితము లెట్లుబలపరచుచున్నవో చూపుటకై చేసినవివరణము సుస్పష్టముగాలేక గందరగోళముగా నున్నది. పైగా తెలుగనువాదమునందు హిందీభాషా సాంప్రదాయికములు ఎక్కువగా పాటించబడుటబడియుండుటవల్ల విషయగ్రహణమునకు భాషాసౌలభ్యముకూడ సమగ్రముగా ఉపకరించలేదు.

మొత్తముమీద ఆర్యసమాజముయొక్క యథార్థలక్షణమును గ్రహించుటకు ఈ గ్రంథముచాలముఖ్యమైనది. ప్రతిఆర్యసమాజీయుడును ఈ గ్రంథమునుతప్పక సంపూర్ణముగాచదివి ఇందలి విషయములను తెలిసికొనియుండవలెను ముఖ్యలక్షణమును తెలిసికొనకుండ ఆర్భాటముచేయువారు ఆర్యసమాజగౌరవమును కాపాడజాలరు.

—

## స్వామి దయానంద సరస్వతి

ఇది శ్రీ వెల్దుర్తి మాణిక్యారావుగారు రచించినది. హైదరాబాదు దక్కను). త్రూపుబజారులో ౩౬౯ నెంబరు గృహమందు ఆణాగ్రంథమాలచే ప్రకటించబడినది.

గ్రంథము మనోజ్ఞముగా రచించబడినది. దయానందుని జీవితములోని మహత్త్వమును తెలుపు సంఘటన లనేకములు ఆకర్షకముగనున్నవి. మొత్తము ౨౩ పుటలుగలవు వెల ఒకఆణా. అణాగ్రంథమాలవారినుండియే దొరకగలదు.

—

## హిందూ రాష్ట్రపతి వినాయక్ దామోదర్ సావర్కర్

ఇదియు అణాగ్రంథమాలవారి చేతనే ప్రకటించబడినది దీనిరచయిత జే. రంగదాసుగారు గ్రంథము మొత్తము ౩౭ పేజీలు. వెల ౭ ఆ ణా. పైగ్రంథమాలవారినుండి లభించగలదు.

ఈ గ్రంథముయొక్క ప్రతిపుటయందును వినాయక్ సావర్కరుగారి విప్లవతత్త్వము పుష్టిగా స్ఫురించుచున్నది.

సావర్కరుగారు భవానీదేవి సన్నిధిలో "తల్లీ! భారతదేశ దాస్యవిముక్తికై నాసర్వస్వమును అర్పించుచున్నాను. విజయములను బొందుటకై నన్నాశీర్వదింపుము" అని ప్రార్థించినపుడు భవానీదేవి అట్లే ఆశీర్వదించెనని చెప్పబడినది. సావర్కరుగారు ఫ్రాన్సులో శరణుజొచ్చియున్న కాలములో ఒకనాడుధ్యానములో "నీస్నేహితులును, అనుచరులును, నీసోదరులును, నీరులేక గాలిలేక, వెలుతురులేక గుహాలలోపడి కుందుచుండ, నీవిట్లీయానందము ననుభవించుచుండుట న్యాయమా?" అని ఒకఆకాశవాణి వినిపించినట్లు వర్ణించబడినది. ఇవిరెండును ఈ ఆధునిక విజ్ఞానకాలమున ప్రాచీన ఇతిహాస లక్షణములను జ్ఞాపకము చేయుచున్నవి.

—

## హాలికుడు

ఇది కాలావాఙ్మయమువారి ౨వ గ్రంథము కర్త, శిరోమణి, చలమచర్ల రంగాచార్యులు గారు.

ఇది ౫ దైవరంకముల నాటకము ఇందు శ్రీఆంధ్ర మహాభాగవత ప్రణేతయగు బమ్మెర పోతనామాత్యుని జీవితము. కొన్నికొన్ని వినోదఘట్టములతోగూడి చిత్రించబడినది ఆంధ్రమహాకవీంద్రుల జీవితచరిత్రము, సృష్టికావ్యముగ నెన్నదగుట కిదియే మొదటిదని యనవచ్చును. శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు, రాయప్రోలు సుబ్బారావుగారు మున్నగు ప్రముఖులు దీనిపైనిచ్చినవారివారి సదభిప్రాయములిందు మొదట సమకూర్చబడినవి ఇట్టియభిప్రాయముల ప్రకటించుపుటలుగాక, యిందు మొత్తము ౧౩౯ పుటలుగలవు, పుస్తకమునకు జివర "సాధుపత్రము" కలదు. గ్రంథము ముఖపత్రముపై హాలికుడగు పోతనమనీషి చిత్తరువు అందముగా చిత్రింపబడినది

నాటకమున, సంభాషణలు, రసవంతములుగ రచింపబడినవి పద్యశైలి మృదుమధురముగ నున్నది పాత్రల యౌచితీనిర్వహణమున కవిగారు తమ సహజశక్తిని వినియోగించి తమకవిత్వ, పాండిత్యములను పండితపామరజనస్తుత్యములుగ జేసికొనిరి లాక్షణికు, రసికలోకముల దృష్టియందీ నాటకము నిర్దుష్టమై ప్రయోక్తల కానుకూల్య సంధాయకమై ప్రేక్షకుల కాహ్లాదదాయకమై యున్నదనుటకెట్టి సందియమునులేదు పుస్తకస్వరూపము సైజు మున్నగునవి చూచుటకింపుగాయున్నవి కాగితములు ఏరికోరకనుండి, ముద్రణము చక్కగనున్నది. ప్రతివారును చదివి యానందింపదగిన గ్రంథము,

వెల ౧—౧౨—౦ మరువారలకు ౧ణా

దొరకు చోటు:— శిరోమణి సి. హెచ్. రంగాచార్యులుగారు నెం ౧౯ రామవిలాస్, ఇసామియాబజారు, హైదరాబాదు(దక్కను)

—

## దక్కను మానవ సేవాసమితి

(సికింద్రాబాదు

చిరకాలప్రయాస నేటికి ఫలవంతమైనది. ప్రధానఆలయంబగు మహాకాళ్యాలయముకడను తదితరదేవ్యాలయములకడను శుద్ధసాత్త్వికారాధనలు గావింపబడినవి సికింద్రాబాదు గాసుమండిలోని ౧౪ మాదిజనుల దేవ్యాలయములలో ౧౪ ఆలయములలో సాత్త్వికపూజ గావింపబడినది. పట్టణమునందున్న డొక్కలమ్మగుడి. పీనుగులమల్లన్నగుడి దప్ప మిగత యాలయములన్నియు మాప్రబోధమునకుసరించి సాత్త్వికపూజ గావింపబడినవి,

స్నేహితసంఘసభ్యులు మహోదారమతితో నీవత్సరము గతవత్సరము వలెనే మాకుసాయపడి యీ అహింసా ప్రచారమునందు చేయూతనొసంగిరి. మాసమితిపక్షమున వారికెంతేయు కృతజ్ఞులము

శ్రీయుత యల్ శంకర్, యల్ నారాయణ బొందుగుల వీరయ్య, రామారావు శ్రీబచ్చుగురుమూర్తి రాంలాల్, జంగేటిబాలయ్య రాపోలు విఠల్ గార్లెంతేని వంద్యులు,

స్థానిక భజనసామాజికులు, వర్తకబృందము. తదితర పౌరమహాశయులు దేవ్యాలయముకడ నిరంతరదీక్షతో అహింసాకృషి గావించి మాకృతజ్ఞతకు పాత్రులైరి. శ్రీయుత బియస్ వెంకట్రావు, ఆరిగరామస్వామి గార్లీ యహింసావ్రతంబునకెంతేని దోడ్పడిరి. శ్రీయుత వెంకట్రావుగారీవత్సరమున గావించిన కృషి మరువరానిది. సమితిసభ్యులలో శ్రీయుతులు ఆర్, కే. వాసుదేవ మొదల్యారు యం. రాజరత్నం మొదల్యారు యస్-రామస్వామి. యస్-శ్యామారావు పై-బాలరాజయ్య అనంతుల రంగపాండు, బెల్దె జగదీశ్వరయ్య, బెల్దె కుమారస్వామి, ద్రుమాల్ల బుచ్చివీరయ్య, పోలంవీరయ్య గార్లెంతేని పాటుపడిరి వీరికి నాకృతజ్ఞతాపూర్వక వందనములు వర్తకశిఖామణులు మాకునాడే సోదరులగు శ్రీయుత సుబ్రహ్మణ్యల్ సేటుగారు యభిమానపూర్వకముగా భూరివిరాళములనొసంగి యెంతయో సాయపడియున్నారు,

హైదరాబాదు వాస్తవ్యులు బ్యాంకర్లునగు శ్రీయుత ముంతజిమ్ బహద్దూరు రాయిసాహెబు జమ్నాలాల్ రామలాల్ కీంతీగారు ౫౧ రూపాయలు విరాళమొసంగి సమితికృతజ్ఞతకు పాత్రులైరి,

స్థానికరక్షకభటుల సాయము మరువరానిది. రాత్రింబవళులు కొత్వాలుగారు సమయిన్సిపెక్టరుతో సహా నారంగమునందుండి శాంతిని కాపాడియుండిరి శ్రీయుత అన్నాజీ వుగారు ఆరోగ్యశాఖాపక్షమున విశేషసౌకర్యములు ప్రజలకు గలిగించియుండిరి? మాసమితిపక్షమున వీరి కెల్లరకును మాకృతజ్ఞతను దెల్పుకొనుచున్నాను.

ఈ యమూల్య ధర్మకార్యమునందు సాయపడిన మహనీయుల నామములనే విస్మరించితినేని వారన్ను క్షమింపనర్థించుచు వారెల్లరు మాకృతజ్ఞతాపాత్రులుగ గ్రహించి నావిస్మృతిక్షమింప ప్రార్థించుచున్నాడను.

ఇట్లు
అ. వే. దత్తాత్రేయశర్మ
గౌ. కార్యదర్శి

—



## నైజాము ప్రజలకు హెచ్చరిక

నైజామునకును, బ్రిటిషువకును వీ.పి. పద్ధతిలేకపోవుటచే మా అనుభూతమందులను, యితరమందులను గ్రంథములను తెప్పించుకొనుటకు యిబ్బందిపడుచూ అనేకమంది కోరుటచే యీక్రిందివారిని నైజాములో మాస్టాకిస్టులుగా యేర్పాటుచేసితిమి కావున నైజాముప్రజలకు యీవిషయము తెలియపర్చడ మయినది,

స్టాకిస్టులు:—మధిర డాక్టరు రామగోవిందం.

„ ఖమ్మంమెట్టు:-బొమ్మిడి రామకృష్ణయ్య సన్సు.

„ వరంగల్లు:-రవ్వాలింగయ్యగారు, లేక కుమారా ప్రింటింగ్ వర్క్సు.

„ సికింద్రాబాదు:-మూల్‌చంద్ అండ్ కో, స్టేషన్ రోడ్.

„ హైదరాబాదు:-కింగ్ అండ్ కో.

(శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి)

సంవత్సరము చందా
౬ హాలీ రూపాయిలు
ఆరునెలలకు
౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥ చందా
౫-౮-౧ కంద్రా.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only Popular Paper That reaches The masses In the Dominions

Best Medium for Advertisement

Volume 15 | Hyderabad-Dn. | Thursday 1 August 1940 | Number 25

## యుద్ధవార్తలు

(మొదటిపేజీ తరువాయి)

ప్రభుత్వ కార్యలయెడ బ్రిటిషు ప్రభుత్వమువారు తమ ఆగ్రహమును రుమేనియావారికి తెలిపినారు. రుమేనియావంటి సరియగు సమాధానము రానిచో రుమేనియాపైకెగిన ప్రతిక్రియ సాధింపుటకు బ్రిటిషువారు సిద్ధపడుచు, మధ్య ధరాసముద్రములో మూడు రుమేనియా ఓడలనాపినారు.

## బ్రిటనుపై జర్మనీ దాడి ఎప్పుడు?

హిట్లరుగారు బ్రిటిషు ప్రభుత్వానికి స్వీడను రాజుగారిద్వారా ఏవో సంధిసూచనలను పంపించి నారట. అవి బ్రిటనుకైతే చేరినట్లు తెలియుటలేదు.

హిట్లరుగారు బ్రిటనుపై దండయాత్రను పూర్తిగా ఆగష్టు నెలమధ్యలో ప్రారంభింతురనియు, ఈలోగా బ్రిటిషు ఓడలపై బాంబులను వేయు చుండుటకున్న సన్నాహములను చేయుచుండెదరనియు టర్కీలో చెప్పుకొనుచున్నారు.

## రష్యా

రష్యా ప్రభుత్వమువారును అఫ్గను ప్రభుత్వమువారును ఒక వర్తకపు ఒడంబడికపై సంతకములు ఆయిదురోజులక్రింద చేసినారు.

రష్యాతో వర్తకపు ఒడంబడిక చేసికొనుటకై జర్మనీవారు కొందరు నిపుణులను పంపినారు వారు జులై ౨౫వ తేది మాస్కో చేరిరి.

రష్యాలో ఇంతవరకు సేనలోకి చేర్చుకొనని వారలను చేర్చుకొనుచున్నారు. కాస్పియన్ సముద్రంలో రష్యాయుద్ధనావలు బాకువద్ద చేర్చబడినవి. అమూరునదిపై రష్యాయుద్ధనౌకలు ఎట్లు పనిచేయునది పరీక్షింపబడినది.

## బ్రిటనుజర్మనీలపై పరస్పరము విమానాల దాడులు

బ్రిటనుపైకి జర్మనువిమానాలు అధికముగా పోవుచు బాంబులువేయుచునేయున్నవి. బ్రిటిషుయుద్ధవిమానాలు వాటి నెదుర్కొనునపుడు వాటికిని జర్మనుపోరాటపు విమానాలకును పోరాటములు జరుగుచుండుటయు గలదు. ఈ పోరాటములలో జర్మనువిమానాలు అధికముగా క్రిందకూల్చబడుచున్నవి. జూను ౧౮వ తేది నుండి ఇట్లుమొత్తము ౬౧౮ జర్మను విమానాలు జులై ౨౫వ తేది వరకు కూల్చబడినవి. ఇందులో జులై ౨౫వ తేది అర్థగంటలో ౧౮ విమానాలు కూల్చబడినవి. జులై ౨౫వ తేది ౭ విమానాలు బ్రిటనుపైకిపోయినవి జులై ౨౫వ తేది వేల్సుపై ఇదివరకెన్నడుగాని జరుగనంతదీర్ఘకాలము జర్మనువిమానాల బాంబులువర్షించెను.

జులై ౨౫వ తేదినాడు ౨౧ బ్రిటిషుఓడలు ట్రాలర్లతోకూడ పోవుచుండగా ౩౦ జర్మనువిమానాలువచ్చి బాంబులువేసెను. ౫ ఓడలు మునిగెను. ౧౦ ఓడలు చెడెను. తర్వాత ౯ జర్మను టార్పెడో పడవలనుచూచి రెండు బ్రిటిషు డిస్ట్రాయర్లు వెంటబడగా అవి తప్పించుకొనిపోయెను. బ్రిటిషు డిస్ట్రాయరు ౧ తిరిగివచ్చునప్పుడు జర్మనులువిపరీతముగా బాంబులువర్షించిరి.

బ్రిటిషువారును జర్మనీపైనను జర్మనీపట్టుకొన్న దేశాలపైనను విమానాలలో తిరుగుచు సైనిక ప్రాముఖ్య వస్తువులమీదను స్థలాలమీదను బాంబులువేయుచున్నారు ఇట్లు పోయినవిమానాలలో జులై ౨౫వ తేదినాడు ౫ తిరిగి రాలేదు.

## ఇటలీయుద్ధము

ఇటలీ బ్రిటనుల యుద్ధములో ఒకరిప్రదేశాలపై ఒకరివిమానాలుపోయి సైనిక ప్రాముఖ్యస్థానాలపై బాంబులువేయుటదప్ప మరేవిశేషముగానిలేదు. బ్రిటిషు యుద్ధనౌకలు మధ్యధరా సముద్రములో ఇటలీనౌకల మధ్యగుండా దూసికొనిపోయి అలెగ్జాండ్రియాకు చేరినవి.

## ఫ్రాన్సు

బ్రిటిషువారు రెండు ఫ్రెంచి టాంకరు నౌకలను అలెగ్జాండ్రియారేవులో పట్టుకొని ఆపినారు. వాటిలో పెట్రోలుండెను.

బ్రిటిషు బ్యాంకులలో ఫ్రెంచివారిడబ్బును కదలనీయకుండ బ్రిటిషువారుచేయుటచే ఫ్రెంచి ప్రభుత్వమువారిపుడు ఫ్రాన్సులోను, ఫ్రెంచి సామ్రాజ్యములోను బ్యాంకులలో బ్రిటిషువారి డబ్బును కదలనీయకుండఆపినారు

ఇపుడు బ్రిటిషు రేవులలోవున్న ఫ్రెంచి ఓడలను జనరల్ డీగాల్ గారి అధిపత్యమున ఫ్రెంచినావికులతోనింపి యుద్ధమునకు సిద్ధము చేయుచున్నారు

## బ్రిటిషు శిశువులు

బ్రిటిషు శిశువులను బ్రిటనునుండి పంపదలచుచున్నారు, అట్టివారికి అమెరికావారు ఆశ్రయమీయవలెనని చాల కుతూహలముగా నున్నారని రూజ్వెల్టుగారు జులై ౨౩వ తేది పత్రికాప్రతినిధులతో చెప్పినారు. కాని వారిని తెచ్చుటకు పోవు అమెరికాఓడలకు ఉపద్రవము కలుగకుండ అభయము ఎవరుగాని ఇవ్వవలసియుండునని నారు. అనగా ఆఓడలపై శత్రువులబాంబులు పోరాటములు పడకుండునట్లు మాడవలెనని తాత్పర్యము.

కేవలము ధనికుల, పెద్దప్రభుత్వోద్యోగుల పిల్లలనే పంపించుటయందు శ్రద్ధవహించుచున్నారని బ్రిటిషు పార్లమెంటులో ఆక్షేపణలుచేయగా, ప్రభుత్వమువారు అట్టిపక్షపాతము చూపబడలేదనియు, అందరికిని తగుఏర్పాట్లు చేయగలరనియు అట్లు పిల్లలనుతీసికొనిపోవు ఓడలకు శత్రువులవలననుండే ఉపద్రవ భయమెక్కువయనియు ప్రభుత్వపక్షమున సమాధానము చెప్పబడెను.

## హోల్వెలుసత్యాగ్రహ విరమణము

శరతు చంద్రబోసుగారి ప్రకటన

కలకత్తా. జులై ౨౫

నేడు బెంగాలు అసెంబ్లీలో శరచ్చంద్రబోసుగారీక్రింది ప్రకటనచేసిరి_

"బెంగాలు లెజిస్లేటివు అసెంబ్లీసభలో బెంగాల్ ప్రధానమంత్రి ఫజ్లుల్ హకుగారు హోల్వెలు స్మారకచిహ్నమును త్వరలోనే తీసివేయుటకు ప్రభుత్వమువారు యేర్పాటుచేయుచున్నారు అని సుభాషచంద్రబోసుగారి సలహాప్రకారము యీనెలమొదటివారములో హోల్వెలు స్మారకచిహ్నమువద్ద ప్రారంభించబడినసత్యాగ్రహమును ప్రస్తుతము ఆపియుంచవలెనని ప్రజలనుకోరుటకు నేను పూనుకొంటిని దీనిని పూర్తిగా నిలిపివేయుటకు సుభాషచంద్రగారికే గాని మరెవరికిని అధికారములేదు. ఈసత్యాగ్రహసందర్భములోనే ప్రభుత్వమువారు సుభాషచంద్రబోసుగారిని. మరి పెక్కుమందిని అరెస్టు చేసినారు. విచారణలేకుండ వీరివందరిని నిర్బంధములో వుంచియున్నారు. వారిప్పుడు యీచిహ్నమును తీసివేయుటకు నిశ్చయించిరి. గనుక వెంటనేవీరినందరిని వదలివేయుటకూడ ప్రభుత్వమువారికి కర్తవ్యమే- ఈ సందర్భములో ఈనెల౨౫వ తేదీనుంచి అరెస్టుచేయబడినవారినందరిని వెంటనే వదలవలెనని ప్రభుత్వమువారికి [illegible] కలకత్తాలో యిస్లామియా కాలేజీలో పోలీసువారు విద్యార్థులను లాఠీలతో యీనెల౨౧తేదీని కొట్టుటను గురించి విచారణచేయుటకు [illegible] యేర్పరచెదమని ప్రభుత్వమువారు చెప్పియున్నారు- కాని ఆ సంఘమువారివిచారణ యింకను ప్రారంభముకాలేదు- విద్యార్థులు నిర్దోషులని విచారణ సంఘమువారు నిర్ణయించినట్లయిన ప్రభుత్వమువారు వారికందరికిని నష్టపరిహారము నీయవలెను- సత్యాగ్రహమును పూర్తిగా విరమించుటను గూర్చి సుభాషచంద్రబోసు గారు యీవిషయమునన్నిటిని గురించియు యోచించవలసియుండును-"

## హైదరాబాదు యుద్ధసహాయము

### హరికేన్‌ఫండు

అందరి సహాయముతోను యీకొద్దికాలములో హైనిధికి ౨౦లక్షల కల్దారురూపాయిలకు పైగా వసూలైనవి. ప్రతిదినం ఇంగ్లాండులో ఆకాశయుద్ధాలు జరుగుతూవున్నవి. కావునఈరాష్ట్రమువారి దానంకూడా తంతిద్వారా తెలుపవలెను. ఇంకా చందాలియ్యనివారు ఈఅవకాశాన్ని పోగొట్టుకొనవద్దండి ప్రతియింటిలో ప్రతివారున్ను సహాయముచేయండి చందాలియ్యండి రశీదులుపొందండి అని ప్రభుత్వమువారు ప్రకటించినారు

### జాగీర్దారుల యుద్ధసహాయము

హైదరాబాదు జాగీర్దారుసంఘమువారు గతగురువారమునాడు న. కమాలుయార్జంగుబహద్దరుగారి దేవిడీలో కలిసిరి. ఉపన్యాసాలు జరిగెను తుదకు నిర్ణయమైనదేమంటే జాగీర్దారులంతా వీరు ఆదాయములో నూటికి ౨రూపాయీలప్రకారం చందాలివ్వకోవలెను. సర్కారువారు పైకొన్ని యిప్పుడేచెల్లించి నిదానంగా జాగీర్దారులవద్ద అబ్కారీ పైకంనుండి రాబట్టుకోవలెను,

### రెవెన్యూఉద్యోగులు—యుద్ధోద్యోగాలు

౧౦మంది ఎచ్. సీ. యస్. వారిని ౧౦ మంది తహసీల్దారుల యుద్ధపు అధికారాలనిచ్చి పనితీసుకొనుటకు హైద్రాబాదు ప్రభుత్వమువారు ప్రకటించినారు. అభిలాషులైనవారు ప్రభుత్వం వారికి తెలుపుకొనవచ్చును.

### మెహిదీనవాజుజంగుగారు

హైదరాబాదు(దక్కన్),సహారేవరు ౨౮

పురపాలక సంఘాధ్యక్షులైన నవాబు మెహిదీనవాజుజంగు బహదరుగారు రెండునెలల సెలవుతీసుకొన్నారు. వారిస్థానములో డాక్టరు సీ. యఫ్. చీనాయిగారు పనిచేయుదురు.

## దేశరక్షణ నియమాల క్రిందచర్యలు

జులై ౨౫ సాయంత్రము శ్రీదర్శి చెంచయ్యగారు శ్రీ యర్రమల్లి నరసింహారావుగారు. తుని తాలూకా కాంగ్రెసు అధ్యక్షుడు, శ్రీ యినుగంటి నారాయణరావుగారు డాల్టన్‌గంజ్ జిల్లా సత్యాగ్రహకమిటీ సభ్యులగు భాగీరథీసింగ్‌గారును, షహాబాదుజిల్లా ఫార్వర్డుబ్లాకు కార్యదర్శియగు అవధా బిహారాయిగారు, అరెస్టులు చేయబడినారు.

బెంగాలు శాసనసభసభ్యులగు నీహారేందు దత్తు మజుందారుగారు బీహారురాష్ట్రములోనికి రాగూడదని బీహారుప్రభుత్వమువారునిషేధించిరి

## అత్రాపుబల్దా జిల్లా ఆంధ్రజనసంఘము

రెండుమారులు కోరం లేదు

నలుగురు ప్రాతసభ్యులు

౧౯ క్రొత్తసభ్యుల ఎన్నుకొనుట

౧౦ సహారేవరునాడు అత్రాపుబల్దా జిల్లా ఆంధ్రజనసంఘము సమావేశమయ్యెను.

నలుగురు సభ్యులేవచ్చిరి. కోరముకాలేదు. అయినను గతసభ కోరముకానందున ఆపివేయబడియుండెను. ఇది ఆపివేయబడినతర్వాతసభ కనుక కోరముకాకున్నను సభాచర్యలు జరుపనైనది.

ముందు కార్యనిర్వాహకసభకు యీక్రింది వారిని ఏకగ్రీవముగా ఎన్నుకోనైనది.

అధ్యక్షులు బలవంతరెడ్డిగారు, ఉపాధ్యక్షులు భీమసేనరావుగారు, కోశాధ్యక్షులు రాఘవరెడ్డిగారు, కార్యదర్శి రామరెడ్డిగారు, కందిశ్రీనివాసురావుగారు సంయుక్తకార్యదర్శి

సభ్యులు సలువేరు నారాయణరెడ్డి, కొహెడ పుల్లారెడ్డి, పలాయపల్లి వీరారెడ్డి, అకుట్ల యాదయ్య బొజ్జం నర్సిములు, చేలె లక్ష్మయ్య, జగ్గారెడ్డి లక్ష్మీనరసింహారావు, కొండాపురము నా[illegible] వెంకటరామారావుపటువారి దోభి [illegible]

## రైల్వేఉద్యోగులమొఱలు

సికింద్రాబాదు(దక్కన్), షహారేవరు ౨౮

౨౦ జులైనాడు లాలాగూడాలో నిజాంరైల్వేనౌకరులసభ జరిగెను. అందుకొన్ని ఉపన్యాసాలు జరిగినతర్వాత యీక్రింది తీర్మానాలు గావింపబడెను.

నిజాంస్టేటురైల్వేనౌకరులు వరుసగా కడు శాంతముగా న్యాయబద్ధముగా రైల్వే సేవచేయుచున్నారు. వారి సవ్యమైనకోరికలనుఅనుగ్రహించవలసియుండును. కాని దురదృష్టముచేత ఈ శాఖవారు చాలాఅశ్రద్ధ నిర్లక్ష్యముచేసినారు. రైల్వేఆదాయము వృద్ధిఅయినది. నౌకరులుకూడ తమకోరికలను తెలుపుకున్నారు. కాని ఫలితం లేకపోయినది. అయితే ఈశాఖవారు లక్షలరూపాయీలను వినోదరంగాలకును జంతువుల సౌఖ్యభవనాలకుగాను మరియితర బూటకంపనులకును ఖర్చుచేసినారు, ముఖ్యముగా నౌకరులపై కొత్త సర్వీసుబాండులనుసరించి కాఠిన్యమువహించినారు. రైల్వేశాఖవారు ౧౭ఏండ్లనుండి పనిచేయుచున్న రైల్వేనౌకరులసంఘము నొరుసు నొక్కినారు దీనికివిరుద్ధముగా మరొక సంఘాన్ని నిలబెట్టినారు. నౌకరులు అన్నివిధాలా తమబాధ్యతలతో మొరపెట్టుకున్నారు. లాభము లేకపోయినది. కయీనౌకరులు "సీదాగా కార్యక్రమాన్ని" సాగించితే తప్పుండనేరదు. అయితే యుద్ధముమూలాన బ్రిటిషువారి సేవచేయుటకు మేము మాటయిచ్చినాము. ఈసమయములో వారికిబ్బంది కలిగించగూడదు. అందుచేమేము రెసిడెన్సీకిన్ని ప్రధానమంత్రి గారికిన్నీ రైల్వేబోర్డుకున్ను అవసరమగు శ్రద్ధవహించుటకై ప్రార్థించుచు విజ్ఞప్తి చేసుకొనుచున్నాము.

## బాల్యవివాహ నిషేధము కావలెను

హైద్రాబాదు విశ్వబ్రాహ్మణ సేవాసంఘ నిర్ణయము

హైద్రాబాదు(దక్కన్) షహారేవరు ౨౩

హైద్రాబాదు ౨౦షహారేవరు ౧౩౪౯ఫసలీ దినం యస్. రామస్వామిగారి అగ్రాసనాధిపత్యమున నొకసభజరుపబడెను! అట్టిసభకు చాలాప్రముఖులు విచ్చేసియుండిరి, సభయందు సంఘనాయకులు బాల్యవివాహ నిషేధమునుగూర్చి మాట్లాడుచు ప్రాచీనమునుండి వచ్చినమర్యాదను చారిత్రికముగా హిందూజాతిలో బాల్యవివాహములు లేకుండెననియు హిందూమతగ్రంథములు బాల్యవివాహ వ్యతిరేకముగా ఘోషించుచున్నవనియు ఎక్కడినుండియో మధ్యకాలమున బాల్యవివాహ పిశాచమావరించెననియు దీర్ఘముగా మాట్లాడుచు. ఇట్టిపిశాచమును పారదోలుటకై మనకు ఛత్రచ్ఛాయగానుండిన హైద్రాబాదు ప్రభుత్వమువారు తగుఉపచారముల త్వరలోచేయవలెననియు సుపన్యసించిరి. తర్వాత సభవారందరు బాల్యవివాహమును ఘంటాఘోషముగ నిషేధించుచు మనప్రభుత్వమువారిని త్వరలోయిట్టిచర్యకై కొని ప్రభుత్వశాసనమును గావించవలయునని ప్రార్థించుచు సభముగియజేసిరి.

కార్యదర్శి

## గల్బవీధిలో "మున్నూరుకాపు" సంఘస్థాపన

హైదరాబాదు షహారేవరు ౧౫

నేడురాత్రి ఇక్కడ గల్బవీధిలో మున్నూరు సోదరుల సభాసమావేశమై సంఘస్థాపన జరిపి ఈక్రిందివారిని కార్యకారిణిసభ్యులుగా నెన్నుకొనిరి,

గూశె బాబయ్యగారు అధ్యక్షులు, ప్రస్తుత కృష్ణయ్యగారు కార్యదర్శి, మరి ౯ మంది ఇతర సభ్యులు.

శ్రీ మిట్ట లక్ష్మీనర్సయ్యగారి అధిపత్యమున ఫీల్ఖానలో శ్రీపతి రంగయ్యగారి భవనమున సభచేసి తీర్మానించినదానిని ఈ సంఘమువారు నిరసించుచు మనహైద్రాబాదులోనున్న మున్నూరు కులసోదరులను భిన్నాభిప్రాయపడకుండ హెచ్చరించుచున్నారు అనుటిన్యానము ఆమోదించబడినతరువాత సభముగింపబడినది.



Printed and Published by. G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad-Dn. Editor- S. Prathapa Reddy B. A. L. L.